TPLE101B216

# పునస్సంధానము

గ్రంధకర్తగారి ధర్మం.
7-4-51

వేమన పంచాయితీ గ్రంథాలయం,
తేలప్రోలు :: కృష్ణాజిల్లా.

రచయిత:
**పి. హనుమయ్య,** బి. ఎ., (ఆనర్సు)
లెక్చరర్, ఏ. సి. కాలేజి, గుంటూరు

ప్రథమముద్రణ 1000 ప్రతులు

1951

హక్కులు
గ్రంథకర్తవి

ఫైన్ ఆర్ట్ ప్రింటర్సు
గుంటూరు

TPLA114B116




**జి. జాషువా కవి**

గుంటూరు
22–3–51

శ్రీ పి. హనుమయ్యగారు లేతప్రాయాన్నే పట్టభద్రులై ఆచార్య పీఠాన్ని అలంకరించిన మధుర భావుకులు. నవ్య భావావేశం కలవారు. వీరు వ్రాసిన 'పునస్సంధానం' అనే కావ్యాన్ని సమగ్రంగా చూచాను. సలీం చిన్నతనాన కామించిన నూర్జహానును భార్యగా స్వీకరించినకథ యిందలి యితివృత్తం. నిజనాథుని సంహరించిన, కర్కశ మోహపీడితుడైన చక్రవర్తి ప్రణయభిక్షుకుడై కళ్లెదుట కన్పట్టగా విధిలేక కన్నీటి కౌగిటి నర్పించిన దీనురాలైన నూర్జహానురాణిమనః ప్రవృత్తిని, నిజాపరాధాన్ని సమర్థించుకొంటూ క్షమాభిక్ష నర్థించు సలీమునిచిత్తవృత్తిని శ్రీ హనుమయ్యగారు రసదృష్టితో చక్కగా చిత్రించారు. ధారాపాకభావకల్పనలు రమణీయంగా యున్నయి. కావ్యం చదివినవారు రచయితకిది ప్రథమమని విశ్వసించడానికి ఎడమీయని ద్రాక్షపాకడ లింపులో పలుతావుల్లో గోచరిస్తున్నయి. వీరి కుజ్జ్వల మైన భవిష్యత్తున్నదనడానికీ కావ్యం నిదర్శనమని నాయూహ.

జి. జాషువ





# కృతజ్ఞత

తనకరుణారసదృక్కులతో తేనెదీపాలు వెలిగించి,
చీకటిశిథిలజీవితంలో చిదికిపోతూన్న యీ నా
కావ్యసుందరిని ప్రపంచానికందించిన
శ్రీ వాసిరెడ్డిరంగనాయకులుగారికి
నేను సదాకృతజ్ఞుణ్ణి



# అంకితం

△

నా హృదయంలో
మధుకీలలు
మండించిన
ఒకానొక
సౌందర్యమూర్తికి

△

# ఒక మాట

1949 లోనే పూర్తయిన యీ నా కావ్యం కారణాంతరాలవలన యింతవరకు అజ్ఞాతవాసంచేసింది. ఈనాడు కాలుగదలి పాఠక ప్రపంచపు గడప త్రొక్కింది. నాకర్తవ్యం నెరవేరింది. ఇందు మూలకంగా వచ్చే గౌరవాగౌరవాలు వేరెమాట.

నేనీ కావ్యాన్ని 'పునస్సంధానం' అని పిలిచాను. పరస్పరం నిష్కళంకంగా ప్రేమించుకుని వివాహం మాడబోయే తరుణంలో కాల ప్రవాహంలో ఒడుదుడుకులు రేగి చెల్లాచెదరై వియోగంలో తపించి చివరకెలాగో తిరిగి కలుసుకుంటారు నాయకీ నాయకులు. పునస్సంధాన మన్నమాటను తిరిగి కలుసుకొనడమనే అర్థంలోనే నేను వాడాను.

ప్రేమభగ్నమైనందున నిస్పృహజెంది, ఆనిస్పృహలో వివేచనా జ్ఞానాన్ని కోలుపోయి ప్రళయకాల భయానక మూర్తిగా తాండవిస్తూ మారణ వీధుల్లోగుండా పరుగులెత్తుతూ, నెత్తురు చేతులకోవచ్చి నిలుచుండిన జహంగీరు, నిజనాథుని వధమూలకంగా రేగిన శోక కోపాలల్లో విలయిస్తూన్న నూర్జహాను ఒకరి నొకరు ఘర్షించుకుని, అర్థంచేసుకుని ఐక్యమవడమే యీ కావ్యానికి యితివృత్తం.

జహంగీరొక మొగలు చక్రవర్తి. నూర్జహాన్ను బాల్యంనుంచీ ప్రేమించాడు. ఆమె ముగ్ధమోహనసౌందర్యమూర్తి చుట్టూతా ఒక అఖండ సుఖమయప్రపంచాన్నల్లుకున్నాడు. కాలవశాత్తున నూర్జహాను మరోవ్యక్తిని పెండ్లాడ్డం జరిగింది. కొంతకాలానికి జహంగీరు నూర్జహాను భర్తను చంపి ఆమెను బలవంతంగా తెచ్చాడు. నూర్జహాను కృద్ధయై ఏడు సంవత్సరాలు పల్లెత్తి పలుకరించలేదు. కళ్లెత్తి చూడలేదు.

ఏవో యేడు చివర పలికింది. కానవి ప్రణయమాలాపాలు కావు - ప్రళయకాల పయోధర గర్జారావాలు. కళ్లెత్తి చూచింది. కానవి ప్రణయాపాంగవిలోకనాలు కావు-దా వా న ల వి స్ఫు లిం గా లు. జహంగీరు వాపోతాడు, తన్ను తాను సమర్థించుకుంటాడు. నూర్జహాను భర్తను నిందిస్తాడు; నూర్జహానుపై అపరాధం వేస్తాడు, ఆత్మహత్యకు పూన్తాడు, నూర్జహాన్ను కరగిస్తాడు, కరుణాసాగరాలను వుప్పతిల్లిస్తాడు, కరుడుగట్టిస్తాడు, ప్రణయశృంగాగ్రాలను సృజిస్తాడు; నూర్జహాన్ను వాటిపైకి అమాంతంగా విసరివేస్తాడు, బ్రతిమాలించుకుంటాడు, నిరాకరిస్తాడు, సమ్మతిస్తాడు. ఇరువురు ఏకమైతారు. విశ్వంఛత్రాలు పట్టింది. జీవితం పూలు పూసింది.

ఇలా ఆ రెండు ప్రేమహృదయాలు గతించిపోయిన విషాద గాథలోని విషయాలనన్నిటను తడవుకుంటూ కాలసూత్రం పోడుగూత గమిస్తుంటే వెలుగులో తేరిన దృశ్యాల్ని, గాలిలో సాగినమాటల్ని, హృదయంలో పొంగిన భావజాలాన్ని చిత్రించడానికి పేర్చిన శబ్ద సామగ్రియే యీ నా కావ్యం.

నాయకీ నాయకుల చిత్తవృత్తుల్ని మనస్థితుల్ని చిత్రించడంలో మనస్తత్వ శాస్త్రాంశాలను మనస్సులో నుంచుకున్నాను. కామోద్రేకాలను రెచ్చగొట్టే అనవసర వర్ణనలకుగాని నీచ శృంగారానికి కాని నేనేమీ తావీయలేదు. ఆసాంతం పాత్రల హృదయాలను శోధించడానికే ప్రయత్నించాను. అక్కడక్కడ శరీరవర్ణనలు చేశాను. కాని వాటన్నిటను హృదయానికి దర్పణాలుగానే నిలిపాను.

భాషా విషయంలో నేను స్వతంత్రించాను. వ్యవహారంలోనున్న దేశీయాలను అవసరమైనప్పుడెల్ల నిశ్శంకంగా వాడాను. ఖండబింపువుల

విషయంలో మధ్యేమార్గాన్నవలంభించాను. సిద్ధాలను తొలగించి సాధ్యాలను నిలిపాను. సాధ్యాలను తప్పక పాటించాలనడం నా మత మనుకుంటారేమో. అదెంతమాత్రమూ కాదు.

ఈ కావ్యం పూర్తిగా అచ్చయ్యేవరకు విరామం లేకుండా సాహాయపడిన మా వెంకి బావకు (టి. యస్. వెంకటేశ్వర్రావు) చెల్లి కమలకు, అంజిమామ (యస్. ఆంజనేయులు యం. ఎ.) తమ్ముడు సుబ్బారెడ్డికి, కె. యల్. హనుమంతరావుగారికె నేనెంతో ఋణపడ్డాను.

వ్రాతప్రతిని సమగ్రంగా చదివి ప్రోత్సాహంతోబాటు సలహాలను కూడా యిచ్చిన నా సహాధ్యాపకులగు భాషాప్రవీణ శ్రీ సూర్యనారాయణ, శ్రీ మణిమాణిక్యం, యాజ్ఞవల్క్య బి. ఎ. గార్లకు నా కృతజ్ఞత. ప్రచురణ సందర్భంలో హృదయపూర్వకంగా దౌత్యం నెరపి యీ నా కార్యాన్ని నిర్విఘ్నంగా నిర్వహించిన శ్రీ ఆర్. రాఘవరావుగారికి నేనెంతయో కృతజ్ఞుణ్ణి.

అడుగగానే తీరిక చేసికొని, నా కావ్యాన్ని అమూలాగ్రంగ పరికించి అభిప్రాయాన్నిచ్చిన అభినవ కవిచక్రవర్తి శ్రీ జి. జాషువకవి గారికి నా నమస్కారాలు. త్వరగా, చక్కగా అచ్చువేసి యిచ్చిన ఫైన్ ఆర్ట్ ప్రింటర్సుకు, ప త్రి క ల కు, శ్రోతలకు, విమర్శకులకు నా నమస్కారాలు.

ర చ యి త :

# పునస్సంధానము

"కాలకఠోర ఖడ్గవిషఖండన తీవ్రతకూడి, బెల్లికల్
రాలిచి, శేషమై, పృషుల రక్తపు జొట్టులఁ దేలియాడుచున్
దూలిన గుండెముక్క నుసుగోసిటఁ బట్టి భవత్పదంబులన్
వ్రాలితి, దేవిరో; దయను గాలనఁజేయుము ప్రేమభిక్షకున్

చింతనుఁ జింత గోడునది చీదిన నిప్పుకణాలతో భయా
వంతమునౌ యెడారిఁ జెడగాడ్పులు బట్టిన నాదుప్రాణి కా
వంతయు నూపిరుల్ సలుపనైనను దీరిక చిక్కదాయె; ని
యంతము లేని యాత్రలను యౌవనమంతయు ధారబోసితిన్ 2

చిక్కినయట్లు దక్కినటు చేతుల సాపునుఁ జేసువందు నే
తక్కుచుఁ దారుచున్, మొయిలు దాపులలోఁ బురిడించు తీగయై
టక్కున మాయ మాయెను మిఠారిరో! నీదగుప్రేమ; చీకటుల్
గ్రక్కు విషత్పథాలఁ బడి కన్నులుమోడ్చితి దారిఁ దోచమిన్ 3

తీరని యాసలున్ మొనలు దీరిచి నూరిన విచ్చుగత్తు లా
కారముతెత్తి గుండెఁ జిమకం బొడుచుం; బెరవారి కేనియున్
గోరగరాని బాధ యిది; కోమలి నా హృదయాంతరాళమున్
ఘోరవిషాదభారమునఁ గూలుచునుండు నహర్నిశంబులున్ 4

చేసిన బాసలుం జివికి, స్వప్నములైపడి, కాలసాగరా
వాసతరంగభంగఘనపంక్తులలోన లయించె నక్కటా,
ఆస నిరాసతో నొరసి, యంత మెఱుంగని పోరు సల్పి నా
యాసము లెచ్చిపోయె హృదయాంతరరక్తకణాపహారియై 5

ఊహకు సాహసం గలిపి, యుయ్యెలచేర్లు లగించి కట్టి యీ
దేహము తోనె స్వర్గమునఁ దేలగ నెంచుచుఁ, బ్రాకిప్రాకి యా
రోహణముం బొనర్చి యపురూపిణివౌ నిను ముట్టఁ బోయి స
మ్మోహనశస్త్రద్రష్టుడయి మూర్ఛిలి భూమికి వ్రాలిపోయితిన్ 6

అతివ! త్వదీయముగ్ధ నయనాంచల మీనెడు వాలు చూపుపై
నతికి పునాదులన్నిలిపి యందముగా రచియించుకొంటి నా
బ్రతుకు పసిండి మేడలు, గుభాలున గూలెను నేల మట్టమై;
పతితుడనైతి, జీవితము శూన్యమన్నది కంటి నీళ్ళలో 7

క్రమమున్ వీడి, విసక్రమాన్యమయి, ఘోరారణ్యగర్భాంతర
స్థమహోగ్రాద్రిశిఖాగ్రభాగముల దోస్సారంబుగా నెక్కుచున్
దుముకల్ వెట్టిన ప్రేమవాహిని తుదిన్ దూకెన్నిరాశాబ్ధిలో;
సమసెన్ జీవితరక్తిమంబుకలె నాశాజ్యోతి నిట్టూర్పునన్ 8

బలిసిన యాశలన్ జవిరి, భద్రముగాఁ జెనుమూటఁగట్ట, నా
తలపయిఁ బెట్టిపోయి, యెటఁ దాగితివో కనుపించకుండ; నే
నలిగితి మోయలేక; ఒకనాటిద; ఒక్క క్షణంబె యేడుగా
నిలచెను వత్సరాలు పయినించితి నేటికి మూడు నాలుగుల్ 9

రేయి బవళ్ళు కంటిపయి రెప్పలువాల్చ యుఱుంగ, కన్నులుం
గాయలు గాచుజూచితిని; కారు మొయిళ్ళగముల్ పడావులున్
జేయగఁ జిమ్మచీకటులు చిందులు ద్రొక్కునెగాని కంటికిన్
హాయినిఁగూర్చు నీ మధురహాసలసంబులు సోకవెప్పుడున్ 10

నిలువున గుండెలుం బగిలి నీరయిపోయెను; మేని నెత్తురుల్
పలుచనఁ జెందియున్ విరిగె; పట్టుఁ దొలంగె నరాల మొత్తమున్
గలిగిన కండలున్ గరిగెఁ; గాటుకఁ బట్టెను పిల్లప్రేవులున్
నిలిచితి రసముల్ గలిగి కీర్తిఁ వాని విజ్ఞాన ధారుణిన్ 11

సగముపుచ్చినయస్థిపంజరముబట్టి. వ్రేలియాడుచునుండెనా పేదయుసురు
నీదుచిగురాకుపాదాలమీఁదనిడితి, ప్రణయమధురామృతంబులుపారఁజిమ్మి
తిరిగి తొల్లింటి రూపంబుఁ దిద్దితిర్తొ; ప్రళయదావాగ్నికీలలఁ బండఁ గాల్చి
బూది యొనరించి యెత్తెనో బుంగలకును” 12

అనుచు వాపోయి భారతావని విభుండు; చక్రవర్తిజహాంగీరు విక్రముండు
గరడ గాసైనఁగాని బికారివోలె; జడిసి ముద్దయి కన్నీటి జల్లులందు
ముగ్ధ నూర్జాను పాదాల ముంచికడిగి, వారబడె నేలపైఁదనువారనపుడు 13

నేలకు వాల్చియున్న మృదునేత్రము లల్లనవిచ్చి, కోణముల్
దేలిచి, రక్తవర్ణములు దిబ్బెములై తెగమండి పోవగాఁ
దాలిచి, రాజుగారి పసఁదప్పిన మోమునడాన సూటిగా
రాలిచె, వాలుచూపొకటి; రయ్యన వంచెను మోముక్రిందకున్ 14

రాలిన వాలుచూప్రసరంబు పెకల్గిన నిప్పుకొండయై
వ్రేలెనొ యేమొగాని; పృథివీపతి యంతటి వాడుగూడ వా
తూలములోన దివ్వెయయి తూలి నొకింతకుఁ దేరలేక యా
పాళము నూర్జహాను పదపద్మములం దలవాల్చెఁ బోవగన్ 15

పదములు వెన్కకుఁ నడసి బఱ్ఱుమనం దెగలాగుకొంచు, నా
ముదిత పెడాటుగాఁ దిరిగి మోమును సాంతము పైటకొంగుతో
నొదుగగఁ జుట్టుకొన్నయది; యూపుకు దొర్లిన రాజుఫాలమున్
జిదిగి, వెలార్చె నెత్తురులు చెక్కిన సీలపురాతి నేలపై 16

చిందిన రక్తధార నరచేతులు ముంచి, కుదించి యెత్తి ము
న్ముందుకు సాచి, యా సఖియ మ్రోలననిల్చి నచించె; భాష్పముల్
చిందులు గట్టి మోముపయిఁ జిందిన నెత్తురుతోడ మిశ్రమం
బొంది సుసల్సుసల్ తిరిగి ముూచగ యుర్వినిఁ గాసుసీమలై 17

హృదయము పాదిగా సిలచి, యెల్ల శరీరము లోసకున్నదీ
సదములుగట్టి ప్రాకి పయనంబులు సేయుచు, నేని జీవమై
పొదలెడు రక్తధార యిది; పుష్టి వహించిన ప్రేమజీవితా
మధుర నినాదమంజురసమాధురులం దెమలించి పోసెడున్ 18

దీనిని తాపకీనమధుదివ్యపదాబ్జములన్ మెఱుంగు పా
రాణిగఁ బూసికొందు; నధరంబులు నానిచి ముద్దుగొందు; మూ
ర్ధానఁ బ్రతిష్ఠితం బొనరఁ దాల్తును; గద్దెకునిల్పి నిన్ మహా
రాణిగఁజేతు నీ భరతరాజ్యవిశాలవిశిష్టధాత్రికిన్ 19

సాచిననెత్రు చేతులను సాంతముగాఁ దిలకించి నూర్జహాన్
రాచిన త్రాచు బామయి, చిరాకులు చిందులుగట్ట "ధూర్తుడా
పూచిన నందనంబులను బూది నొనర్పగఁ జంక నట్టి నీ
నీచపు చేతులం గవిసి నెత్తురులద్దుట కోడి నిల్చెనే 20

సిగ్గొకయింత లేదె? తమచేసినచేతను నెల్లలోకముల్
భగ్గున మండి పోయినవి; పాపము పుణ్యము నీదుయుక్తముల్
నెగ్గెను రాజువోట; నిను నింద యొనర్చగ నేల? రాజుకున్
దగ్గ పడావులే; కులవిధానమె; యింపున లేమ క్రొత్తయున్ 21

ఎడపెడ కుత్తుకల్ గోరికి, యింపుగ నెత్తురు జుఱ్ఱి, మూల్గలన్
బొడిచి గ్రసించు రాజకులభూతములందున భూతధర్మముల్
నడచునె? మాంసపిండములె శ్రమఫలంబులు సారె పాలునై
కడుపులు నింప హత్యావ్రతకాంక్షప్రయోగులు భూతలేశులున్ 22

నేనొక ప్రేమజీవినని నెత్తురు ముట్టి ప్రమాణమా? భళీ!
కానగలేరె? లోకులకుఁ గన్నులుఁ బోయెనె? క్రూరకర్మముల్
మానకఁ జేసినాడ వవిమట్టిలో నప్పుడె కూరి పోయెనే!
మానవజాతిసమస్తమున మంటలు బెట్టు నహర్నిశంబులున్ 23

నాలుక లేని దేహముల నాగెలు ఒలిచి, లోని నెత్తుకుల్
రాలిచి ముద్దఁజేసి, యుపరంజికిరీటము లల్లుకొన్న దుష్ట్ర
యేలిక వీవు; సుంత గణియింపఁగఁగల్గుదె దేహబాధ? నీ
పాలన కాలకింకరుల శోకుల సాముగదా ప్రజాళికిన్ 24

కాలికిఁ గత్తిఁ గట్టి, పయికంబులు రేగఁగఁ ద్రావి, యెల్లలం
దేలిచి, రక్తమాంసములు దిబ్బలుఁ గట్టఁబరాయి బిక్షలన్
డీలిచి పోల్కుఁబెట్టి, సరిక్షీల పసంపలు సూచి, తుష్టతన్
సోలెదు రాతిగుండెలకు సోకున ప్రేమసుధానుభూతియున్? 25

10



జాతికి శాంతిసౌఖ్యముల స్థాపనఁ జేయు నెపాన వీరులన్
ఘాతమొనర్చి చంపి, పలుగాకులఁ జేరిచి, సత్యవాదులన్
మూతి బిగించి కట్టి, తమ పోకడ లడ్డిన వారి నెల్లరన్
జాతరఁ జేసి, పాలనము సల్పిన తుచ్ఛుడ గావె భూవరా? 26

పౌరుల ప్రాణవాయువులఁ బాపము గుప్పెడు కూటికిన్
దగాబేరము లాడి యాడి కొని, భీకరయుద్ధపు జూదపాటలో
జోరుగ పందె మొడ్డెదరు; జుఱ్ఱుగఁ జూతుర ఖండభోగముల్;
క్రూరమృగాల కంటె నతి క్రూరులు గారొకో ధారుణీపతుల్! 27

కంటికి షోకిలా యయిన కామిని కంటఁ బడన్ భయంబు; మీ
రంటక పోవ నీకు మగనాలి యటన్న వివేచనంబు; మీ
యింటన వంటనన్ గలుగ దింతయుఁ; గ్రాగిన కంటినీళ్ళ పే
రంటము తోడ నంతిపురి వ్రాయుచు నుండు భవత్సుశీలముల్ 28

మీ పశువాంఛ తృప్తికయి నేనులె గాక భిషూపహమైన ని
ల్దోపులు బెట్టగా వలయు దూలకు నిప్పున దూకు మన్న వెన్
జూపగ రాదు; బంధనినచోఁ బెదవుల్ గదలింప రాదు సి
గ్గోపక భార్య నేనిః తమకుంపుడు గత్తెగఁ దార్చగా వలెన్ 29

రాజుల నమ్మి కొల్చి సికరంబుగ నుండిన స్వామి భక్తులే
రోజునో యేన్గు తుండముల రోకటి పోట్లకు నల్గి పిండియై
బూజులు వట్టుటల్ గెడచి పోవగ లేదు; వినిర్మలాత్మనా
మాజు లొనర్చు దోసిళు లమాంతము త్రుంతురు రాచరక్కసుల్ 30

నేటికి నేడునేడులయె నీగృహమందునఁ గాలు వెట్టి, ఈ
నాటికిఁ గన్ను లెత్తి వదనంబును జూచి యెఱుంగ; నోటితో
మాటొక టాడి నిన్బిలచు పాపమునం బడి పోవ లేదు; ఆ
రాటముఁ బట్టలేక నివు డాడితిఁ బగ్గెయు భంగ మొందగన్ 31

కడుపు నిండుగఁ గ్రౌర్యంబుఁ గలిగి యుండి
కంటి కొనలందుఁ దడి పెట్టఁ గలుగు దీవు;
నీదు ముఖమును జూచినఁ బాదు కొనును
కౌర వాది మహా పాపరభసమంత 32

జంతుకంఠాలు విదళించి, చప్పరించి,
రక్తమాంసాలఁ దెగఁదినిఁ, రంపటిల్లు
కరకు సింగంబు పంజలం గన్నె లేడి
నిలువఁగలుగునె? ప్రాణాలు నిలుపు కొనునె?
లెమ్ము నాగ్రమోల నిలువక పొమ్ము మంచు
మనసు మూర్ఖాను తెలపంచి పూని పోమె 33

పలికిన పల్కులన్ని పెను బాకులపోల్కి విధాన గుండెలు
న్నలకటఁ జెట్టి, భావపుమనంబున నిప్పుగుపాను రేచె; ఊ
ర్పులు నలుపంగ లేక పొడి పుంతసఁ గూలిన గండుచేపయై
గిలగిలఁ గొట్టుకొంచుఁ దానికెన్ జలిగన్నుల వెచ్చనెత్తురుల్ 34

సుడువడి మిత్తినోట జనుసోదరు గంతల లోన ముద్దయై
యుడిఁగి, విశీర్ణుడౌచుఁ గొనయూపిరి కొట్టుక లాడ నెటులో
మడువక బైటఁ బడ్డ నొక మానిసి పోలికఁ దెప్పరిల్లి, భూ
పుడు నిలచెన్ వెలంది మొగమున్ గన సుంతయు ధైర్యహీనుడై 35

గుండెలు నిల్వకుండ దడఁగొట్ట, మెయిం జిరుచెమ్మటూటలై
నిండగ, మోము తెల్లనయి నిస్పృహాలం జలికించ, నెత్తిపై
నుండిన రాజలాంఛనము లూడి పడన్ శివమెత్తి నట్లు రా
యండు వడంకుచు న్నఖశిఖాంతమునుండె ననర్థమూర్తియై 36

ముదితపదాల ముందుఁ గరముల్ ముకిళించి, కనోష్ణబాష్పముల్
నదములు గట్ట మ్రొక్కి, వదనంబును వాల్చి, వినమ్ర మూర్తియై
హృదయములోని భావము బహిర్గతముం బొనరింప బూనినన్
బెదవులు కంపమాయెఁ బెనుపేటుల నంటగఁ గుట్టినట్టుగన్ 37

బాణముఁ జేతఁ బట్టి, పరిపంథిశిరాలను ద్రుంచి, నెత్తుటన్
స్నానము లాడి నెగ్గిన యసాధ్యుఁడు జాంగిరు చక్రవర్తి; నూ
ర్జాను తుటారి చూపులకుఁ జాలెనె? పోటరులైనఁ బూరుషుల్
మానిని ముంగలం బనికి మాలిన వారె గదా నిజాని కెప్పుడున్ 38

పట్టిన నిల్వకుండగ జవంబున దూరుచుఁ బిల్ల గుజ్జులై
కొట్టుక లాడు గుండియలఁ గుప్పిటఁ గట్టిగఁ బట్టి, కొండపై
నట్టుల నెత్తికొట్టు బహుకష్టములోఁ బెదవుల్ గదల్చి, సా
మ్రాటు వచించె దుఃఖపరిరంభవికుంఠితరుద్ధకంఠుఁడై 39

"హరిహరి భగ్నప్రేమ యమహాంతకఫాలవిలోకనార్భటిన్
దరుణశిరీషజీవమనుతంత్రుల లోపల నిప్పుఁ బోయ నా
కరయుచు దూరి పోయినది; ఆగ్రహ మూని మృషాపరాధఘో
ధరశతముల్ శిరంబున నుదగ్రత మోపినఁ జచ్చి పోవనే 40

13



రాజులు మూర్ఖులౌచుఁ బరరక్తములన్ స్రవియించి భోగ్యతా
భోజనులౌట నిక్కువమె; పుష్టివహించిన ప్రేమభావసా
మాజికజీవి రాజయిన మానసమార్దవ మెండి పోవునే;
రాజను పేరుకే హృదయరాజ్యమునందున దీనభావుఁడన్ 41

పాతకభీతి వీడి పరప్రాణములన్ బలిపించి నెత్తుటన్
జేతులు ముంచి యెత్తి నృపసింహమనన్ పరివేష్ట్రక్రౌర్యముల్
చూతువె నాయెడంద ననుఁ జొప్పగునే యిటులాడ రాజ్యకాం
క్షాతురరక్తభోజినొ యుషఃప్రణయార్థినొ యీవెఱుంగవే 42

చేసిన నేరమిద్దియనిఁ జెప్పగ రాదొ మొగాన; నూరకే
యీసునఁ బొంగి క్రుంగి తపియింతు; బఱక్కున బండిగుండెలం
గోసెదు సూటిపోట్లఁ జెరఁగొట్టుచుఁ గ్రుష్టుల మీది త్రాచువై
పోసెదు నేత్రకుండముల భూరిభయానకవిస్ఫులింగముల్." 43

"చేసిన నేరమిద్దియనిఁ జెప్పుమటంచును బల్కుచుంటివా?
చేసితొ చేయలేదొ యిటుఁ జెప్పిన నేమి ఫలంబు మూఢ ! నీ
చేసిన చేతలన్ గవుల చేతుల గంటములందు శాశ్వతా
వాసముఁ జేయవే సకలప్రాణుల గుండెలు నీరమౌనటుల్. 44

రాజులు మూర్ఖులంట, పరరక్తములన్ స్రవియింతురంట
రాజవతంసమందున నరాజకముల్ గనమంట, ప్రేమసా
మాజికజీవియంట, మృదుమానసుడంట, మరేమొ నంట;
రాజుల వంటి వాడనగ రాదట ! వహ్వా ! వినంగ చిత్రమా 45

పెదవులనుండి చిందుచు స్రవించెడు తియ్యని తేనెయూటతో
హృదయ విషోగ్రకుండమున కింపగుపూతలు బూసుకొన్న కో
విదులు ధరింపరే సకిలవేషములన్; సమయోచితంబుగా
మెదుపరె నాలుకల్ పసుల మెప్పు ఘటిల్లఁగ లేడె లంపటన్ 46

పాప మమాయకుండవు; నెపంబుల నెన్నిటొ నీదు నెత్తిపై
మోపితి ధూర్తురాలనయి; భూజను లందరుఁ జోద్య మొందుచున్
మోపిరి వ్రేలు ముక్కుపయి, మోమటు లెత్తగ లేను సిగ్గుతో
నీపురిఁ బిన్నపెద్దలన నెల్ల రెరింగినదేఁ గదా ప్రభూ ! 47

ఏలర? నోరు మూయుముర, యెంపుకు వచ్చెఁ బద్ది యిద్దిరా?
కాలువఁ గట్టగా మొసలికన్నులనీరము లీవు జిల్కఁ బ్ర
క్షాళిత మానె పూర్వకలుషాల్? సయిరింపగఁ జేత నైనె బం
ధాలను నిత్యసత్యచరితాత్ముల త్రవ్విమర్మనాశ్వటిన్? 48

దేవుని వోలె నావిభుఁడు దేవివిధంబుస నేను, బిడ్డలున్
కేవలసూర్యచంద్రులయి క్షేమముగా నిమరించుచుండ శో
భావృతప్రేమలోకమును పానుపు మీదికి నర్ధరాత్రి దు
ర్భావన బందిపోటులను బంపిన నీచుడ వీవు గావురా ? 49

పలుచని పాల చెక్కులకు పన్నెలు దిద్దెడి తేత్సుస్ఫ్రోం
జలవల స్నానమాడి, మధుశైశవచిత్రవిచిత్రక్రీడసం
కలితమహాస్మృతంబునగు కమ్మని కాపుర మందు నెత్తురున్
జిలికిన ఘోరపాపమును జేసిన చేతులు నీవె గావురా? 50

15



క్షీరరసాగ్నులన్ దులిపి వేసుగ నెచ్చటో దాచిపెట్టి శృం
గారసుఖానుభూతి నరగన్నులు మోహించిన నావిభున్
జేరగ వచ్చి కంఠమును జీలిచి పోయిన దొంగ లెవ్వరోఁ
గాదు గదా ప్రభూ! తమకు గాఁ బని వట్టిన బానిసీడులే! 51

పీకుడు నామగండు, పృథివీవలయాంచల మంటఁ దెప్పవై
బారిన శౌర్యసాగరుడు; భండన మందునఁ గత్తి దూసిన్
భూరిమహారథుల్ వడఁకి మోముల సుంతయు నెత్తలేకఁ కం
గారయి పారుచుల్ తనదు కన్నులఁ జూచిన సత్యమే గదా 52

ఇన్ని దినాలు రాజ్యమున కెవ్విధ మైనటువంటి భంగ మా
సన్నము గాక పోవుటలు శత్రుభయంకరసింహమూర్తియై
యున్న మదీయభర్త బ్రదికుండుటె కాని మరేమిఁ గాదు నే
నన్నది సత్యదూరమని యంటిరో యేమొ కృతఘ్నభావుడై 53

ఎత్తిన కాయ దించుటయునే యెఱుఁగంగని త్రాగు బోతువై
కుత్తుక లానఁ బొంగులిడు గ్రుడ్డినిషాఁ బొరలాడు నీవు నీ
బిత్తరి లంచగొండులగు పెక్కురుసేవకు లింతరాజ్యమున్
గత్తుల నుండి కావఁగలుగన్ దగినారె నిజాని కెప్పుడున్ 54

బ్రదుకును సొంతమున్ వడచి స్వామిపదంబుల కంకితంబుగా
వదలిన త్యాగమూర్తి కనివార్యగభీరపరాక్రమాబ్ధికిం
బదునులు పుక్కిలించు నొక బల్లెపుపోటును గుండెకాయపై
నదిమి బహూకరించితిరి; అంతియె చాలునులే మహాప్రభూ! 55

పాప మదృష్ట మబ్బి యెటో వచ్చె కిరీటము నెత్తి పైకి నే
పాపము మూటఁ గట్టుకొని భంగ మొనర్పగ నేల నంచు నే
దో పితలాటకానఁ బడియుండెను గాని తలుచుకొన్న చో
మీపని యేమి యయ్యెడిదో మీర లెఱుంగరే? మేదినీధవుల్ 56

ఎంతగఁ జ్యేష్ఠ రాజు మన కెప్పుడుఁ బూజ్యుడె గాన వానిపై
సుంతయు ద్రోహబుద్ధి పొడసూపగ రాదని రాజభక్తిసు
స్వాంతత నీదునేరములసాంతము మన్ననఁ జేసినాఁడు నీ
వెంత తపంబు జేసిన లభించునె యట్టియభూతశాంతమున్ 57

గతమును పెళ్ళగించుకొనగాఁ గనుపింపదె తాము రక్తమున్
గతుకుచు రేచుకుక్కయి షికారులు సల్పిన నాటి గాథ; సా
మెతలయి నోటినోటికి గమించుచు సర్వప్రపంచవీధులం
బితికిన దయ్యగాను, తనపెద్దరికంపునిజాయతీపసన్ 58

జరిగిన ఘోరమున్ జవిరి సర్వము నొక్కటఁ గట్టఁగట్టి వి
స్మరితపథాలలోనఁ బడఁజారిచి యెట్టులొఁ జిత్తశాంతమున్
గరపు కొనంగఁ జూచు ననుఁగాదని లాగెదు వాదవీధికిం
బహువుగ వెళ్ళిపొమ్ము పదిమంది వినన్ దగరాని వీపనుల్ 59

అనిన మాటల సాంతము నాలకించి
చెదరి పోయెడి ధైర్యమున్ గుదుటఁ బరచి
కొని జహంగీరుపాదుషా కోపులి కఁ
దగిన యుత్తర మివ్వంగఁ దలఁచి నిలఁచె 60

జ్ఞానకిరీటధారియయి, సర్వజనాంగము సంస్తుతించ, వే
దానురతిం జరించు మతధర్మప్రచారకు 'ఫెజ్జు'నామునిన్
దేనికిఁ జంపినావు? తమిఁదీరనిరాజ్యప్రలుబ్ధకాంక్షయేఁ
గారణ మగాను గాని, మరి కానగ రావిక వేరె హేతువుల్ 109

చల్లనిమాటతోఁ బయలస్వాంతములం గరగించి, పజ్జకున్
మెల్లగఁ జేరి, దువ్వుచునె, మెత్తగఁ గుత్తుకఁ గోసివేయు నీ
యుల్లమునందుఁ బ్రేమ మెటు లుద్భవమౌను? మహాపరీక్షకున్
మల్లఁ బడంగలేవు నడుమంతరపుంబులిబూచికాటముల్ 110

జంతుఁ కంఠముల్ విరచి, చక్కఁగఁ బ్రోవులు వెట్టి సంతలో
నింతయు జాలి లేక వెలయించు కసాయికిఁ గూడ బౌద్ధనీ
తంతయు వల్లెవేయుట యసాధ్యము గాదు, హృదంతరానుభూ
తింతయు లేని మాటలు లయించవె శూన్యపథాన వ్యర్థమై" 111

నూర్జహాను వచించిన నుడుల నెల్ల
విని జహంగీరు శోకకాంత నెఱుగుఁ జెంది,
"ఏమి యిటులాడు చుంటివి? యేమ నాదుఁ
దుష్క్రియలు సేతె వాస్తవమునంతె? 112

కొడుకును జేతులారఁ దలఁగొట్టి వధించిన గాథ ఫజ్జునిన్
మఱువగఁ జేసియుండిన యమానుష మంతయుఁ జచ్చి జాడ గాఁ
దడవితి! కార్యముల్ నిజమె! దానికిఁ గారణ మేమొ సత్యము
న్నుడువవు; రాజ్యకాంక్షయని నోరు బిగించినఁ దీరిపోవునే? 113

కన్నమరుల్ పదేపదిగఁ గాళులకుం బెనఁజుట్టుకొన్న వా
టన్నిటఁ ద్రుంచివేసి, హృదయంబును రాయిగఁ జేసి, పుత్రవి
చ్ఛిన్నము సేసికొన్నయది శ్రీలను బాముకొనంగఁ గాదు; నీ
చిన్నిపదాల భారతి పసింపగఁ జేయుట కోసమేగదా. 114

పండితుడైన ఫెజ్జు మనపావనప్రేమసుధాస్రవంతిలో
బండలు రువ్వి, జీవితము భగ్న మొనర్చెను; వానిఁ బట్టి నే
గుండెలు జీల్చి రక్తమును గ్రోలితి; ఇందున రాజ్యకాంక్ష యే
ముండెనొ చెప్పవే ? ఎటుల నొప్పెనె నీమది కిట్టులాడగన్ ? 115

నేను జేసిన పాపాల నెన్న లేము;
చేయకుండిన పాపాలు సెప్ప లేము;
నిఖిలకలుషాలు నాహృది నిండు కొనియె;
ఇన్నిపాపాలు సేసిన దెందు కొరకొ ? 116

నీదుపదసరోజంబులపాదిలోన
నస్మదీయజీవితసరిత్ప్రమధార
నిర్జరాంతరవాహిగా నిలుప నెంచి
మరచితినిఁ గదే ! నీతులమండలింపు. 117

ప్రణయకల్లోలభయదమై, రగిలి, మండి,
కంపనంబొందు నాజీవకణములన్ని
ఆగవేగాన ముందుకు సాగి, యురికి,
పాపపుణ్యాల నడిమికిఁ బగులఁ గొట్టె. 118

కన్నుల నంటి ప్రేలునలకల్, మునిప్రేళులఁ బైకిఁ జెక్కి వి
చ్ఛిన్నము నొందనో హృదయసీమను బైట చెరంగు కోడుతం
దిన్నగఁ జుట్టి శాంతమును దెచ్చుకొనెన్ గమించి నిరాదరున్
దన్నుకొనంగ లేచి పడు తామసమెల్లొ నడంచి పట్టుచున్. 99

బాణములన్నిటం బదనుబట్టి భలేగఁ దయారుఁజేసి కా
లూని ప్రశాంతుడై యెదుటనుండిన లక్ష్యములోన నుగ్నుడై
పూనిక నిల్పినట్టి యెలపూవిలుకాని విధాన నామెయుం
బూనెను దృశ్యరాంశువుల భూవిభుమోమునడంక తెల్లనై. 100

"ప్రేమము ప్రేమమంచు నొకపెంపుడుచిల్క విధాన నెద్దియో
వేమరు తియ్యగాఁ బలికివేసితి వయ్యమహాత్మ; కాని యా
ప్రేమమనంగ నెద్ది? ప్రభవించు విధంబదియెద్ది? ప్రేమసం
స్తోమములైన జీవితవిభుల్ పచరించితివే నృపసింహరాజమా? 101

మంచుకొండలకలహూతమస్తమునకు
భయదసేతుపురత్నాలపాదములకుఁ
గరకుఁగత్తులనంతెసఁ గట్టినట్టి
మహిలునాశాసఁ బుట్టిన మగడవావె. 102

అలహిమాలయపర్వత మూన లుండి
లాగి దూర్చిన మీబాకు సాగి పోయి,
కడలిమొత్తునఁ జేపలు బుడుకు వాని
గుండె లోనకు లోతుగా గ్రుచ్చుకొనియె. 103

కన్నబిడ్డలనెత్తుటికాల్వలందు
మునిగి తేలిన భారతపుణ్యజనని
కంటినీరు ప్రతీకారకాండ మగుచుఁ
జరితశంఖంబు లోపల జన్మమొందె. 104

విచ్చుగత్తులు బాలించు విడుదులందు,
శీల మంగటఁ బెట్టిన స్త్రీలతోడఁ
గ్రూరరాక్షసరతిఁ దేలు గీచకులకుఁ
ప్రేమసంగతు లెందుకో! వెళ్ళ వోయి. 105

స్వేచ్ఛ కోసము గుండెలఁ జీల్చి రాల్చి,
తరలి పోయిన వీరుల త్యాగమందు
ముష్టిసింహాసనాలఁ బ్రతిష్ఠఁ జేసి;
పాలనము సేయు కర్కోటప్రభువుగానె. 106

కడుపునఁ గన్నబిడ్డ, మమకార మొకింతయు లేక ఖుస్రునిన్
నడిమికి రెండుగా నరికి నాడవు రాజ్యప్రలోభచిత్తతన్;
బిడియము లేదె యింక నిటుఁ బ్రేలగఁ బ్రేమమటంచు ? భూతమా
వెడలుము రాజ్య మున్నదిగ వేరొక టెందుకు నీకు భామినీ ? 107

నిన్నన నేమి లాభమది నీముదితాతలు దండ్రులందమున్
జన్న పథంబె; ఇంటఁ బడి చచ్చిన రోగమె; ఇందు గ్రొత్త యే
మున్నది; కాని వారలిటు మోసపుప్రేమప్రసంగవస్త్రసం
ఛన్నులుగాదు; నీవదియు సాధనఁ జేసితి వారి మించగన్. 108

మాయపందెంబుఁ గల్పించి మాట లోన
సింహరాజంబు తోడుత జెట్టి పట్టు
పెట్టి చంపఁగఁ జూచిన యట్టి తంతు
మరచి పోనంగఁ జాలుదె మహితలేంద్ర. 81

ఎందుకోయి రాజ! యిటువంటి మాటలు
కాసుకైనఁ గాని యాసు లబ్బి
పసువు సెడక ముందె ప్రభువులు మీరలు
జారు కొంటఁ జాల సవ్య మగును'' 82

అనిన సూర్దాను మాటల కవనివిభుని
హృదయ మందున నెచ్చటో నొదిగి యున్న
కరుణపరిపూరితభావాలు కదలి కదలి
తొణక సాగెను గన్నీరుఁ దొరగలించ 83

అక్కటా! నాదు శోకహృదయంబున జన్మము నొంది నిత్యముల్
జిక్కని రక్తపాయస విశేషములం దెగఁద్రేవి జుత్తి లా
పెక్కిన మల్లెతీగె ప్రసవించిన దొక్కటె పూవు; గుండెలన్
గ్రుక్కి నశింపఁజేయు కడు ఘోరవిషానల గంధ బంధురిన్ 84

పాతిక వత్సరాలు భయభక్తిఁ గొల్చిన ప్రేమ దాసునిన్
జేతులు గొడ్డటన్నరికి చీకటి కోనలఁ ద్రోసి నావటే
పాతకి! ప్రేమ దేవతవు భైరవక్రూర కరాళమూర్తివై
పోతివి; వేసికొమ్ము తలపుర్రెల దండలు గొంతుచుట్టుతన్ 85

పూజలు సేయఁగం బువ్వులమోసిన దోసిలి ఖడ్గ ఛేదితాం
భోజము రీతి నేలఁబడి పొర్లుచునున్నది, చూచిచూచి నీ
రేజనయనాంచలాల సయిరింతువు రోషకషాయ రేఖ; నీ
రాజన మివ్వలేవ యనురాగ వినిర్గమనాశ్రు వాక్కటిన్ 86

విచ్చిన పూలబాణముల వింటి లగించి కుదించి మెల్లగాఁ
దెచ్చెను గుండెకాయకొక తియ్యదనాల వడంకు; మాయుడున్
జచ్చెను నీదుకండ్లు; తొలిసత్తి మగంటును జేరి మెండుగాఁ
జిచ్చులు రువ్వి నా హృదయసీమఁ బసుల్చెను నిప్పుకొండలన్ 87

కటికి కసాయిమైనఁ గసఁగన్నుల నీరము గాంచనేని య
క్కటికము సూపుగాని యరికాళులకుం దలమోడ్చి గుండియల్
బెటలగ నేడ్చి వేడితి, దపించితిఁ, జాలి వహింప వింతకున్
కుటిల మనస్కురాల విపి! కొండరాయి నీయది గుండెకాయ యో! 88

ఆశయ సిద్ధి కోసమయి యాయువులం బలిఁ బోసుకొన్న సం
దేశపు మూసలోఁ బొదిగి తీసిన త్యాగుల ప్రేమజీవి తా
దేశములం బఠించి గడిఁదేరినదాన; తదీయ వాస నే
కోశమునం గనంబడదు కోమలి నీయెడ; నేమికర్మమో! 89

కారెడు నెత్తురుల్ కనుపులై చిందఁగ
బెడదాడ్క కొనలో నడుగులెట్టి
బ్రహ్మాండముల్ మ్రింగి బావురించిన రేయి
కాటుక పొట్టలోఁ బాటఁగొట్టి

కొండ బోదుల లావు కురిసిన వడగండ్ల
వానలోఁ బయనంబు మానకుండ
కులశాసనాలను కోటగోడల నెల్లఁ
దలతాకు దెబ్బతోఁ బగులఁ గొట్టి

ప్రియునిఁ జేరిన కాంతలు ప్రేమజగతిఁ
గలరు కోటాన కోటులు కాని చచ్చి
బ్రతికి జేరంగవచ్చిన ప్రాణప్రియునిఁ
దిట్టిపోసిన వారలు పుట్టలేదు 90

ప్రేమకు జీవముల్ చిదిపిపెట్టిన లైల మహాజులప్పుడీ
నామముగ ముగ్ధజీవులకు నాటి గతించిరి దివ్య పుష్పితా
రామము; దానిలోనకుఁ గరంబును జాచఁగఁగల్గు యోగ్యతల్
భామిని నీకులేవె ? యెటువంటి దురాగతి లోనయితే. 91

కువలయ మంతటిఁ మడిచి గుప్పిటలో నిమిడించుకొన్న భూ
ధవుల శరీరముల్ చివికి ధారుణి గర్భమునందు రాలి రే
ణువులయి పోవలేదటె; మనుంగడ శాశ్వతమేమిఁ గాదు; జీ
వి వసుధ నిర్వహించుకొను వేషములే నిలుచుం బ్రతిరూపశక్తులై 92

మెరుపు గులాబి గుత్తులకు మేలిమి పెట్టెను సున్నితాల కెం
పెదవులు త్యాజ్యమై గురకపెట్టినవీ భసితోగ్ర దేవతా
సదనము క్రింద; వారల ప్రసంగములేమియు లేవు నేడు; నో
సుదతిరో ! ప్రేమలేనియెడ సోయగముల్ నశియించుననన్యమై. 93

24



కిసలయ పీఠికన్ మధుని కేతమందమరించి దానిపై
రసిక కులాగ్రగణ్యు నలిరాజుపవిష్టునిఁజేసి తేనియల్
మెసవగఁ బెట్టుచున్ గనుల మెల్లఁ మోడ్చి ద్రవించిపోవు నా
ప్రసవపడంతి కెవ్వరు గరంచిరి ప్రేమపదార్థ తత్త్వముల్ 94

సఖుడు గతించి పోయిన విచారభరంబున నెండు కొమ్మపై
నొకట వసించి మృత్యువదనోగ్ర శిఖాళికి స్వాగతంబులం
బ్రకటనఁజేసి కొంచు నుపవాసములం గృశియించు పావురా
నికి యెటు లబ్బెనో పరమనిశ్చల ప్రేమపథానువర్తనల్. 95

శ్రమమున కోర్చి పోఁచుచు వసంతము నాటికిఁ జేరవచ్చి ప్రే
మము దళుకొత్త నొండొరులు మచ్చికతోఁ బెనఁగొన్న తీగలీ
క్రమమునఁ బ్రేమపాఠము విరామ మెఱుంగక బోధసేయుచోఁ
గుమతులు సుంతనేర్చుకొనఁ గూడదటే తమకోస మేనియున్ 96

పడమటి దిక్కున న్నలువు పట్టినదో మరి లేదో! యొంటిగా
విడచిచనెన్ మగండు; పురివిచ్చిన గాఢతమస్సులో వాడా
విడిఁ బరుగెత్తుచున్ వెదకి వేసరి యేడ్చునెగాని, యాశలున్
విడువదు, వేరెవానికయి వెళ్ళదు చూడుము చక్రవాకియున్ 97

వినివిని మూర్జహాను గనువిప్పి యెగాదిగఁ బారఁజూచి హేఁ
ళనగ హాసించె; నేత్ర కమలంబులలో నెఱగావి రంగులున్
దనరె; కపోలదోయి ముడుతల్ వడిపోయె; జుగుప్స రేఖలై
పెనగొని పల్లటీల నొగివేసె ముఖంబున భీకరంబుగన్ 98

25



కన్నుల నంటి వ్రేలునలకల్, మునివ్రేళులఁ బైకిఁ జెక్కి వి
చ్ఛిన్నము నొందనౌ హృదయసీమను బైట చెరంగు శోధుతం
దిన్నగఁ జుట్టి శాంతమును దెచ్చుకొనెన్ గమించి మీఁదకున్
దన్నుకొనంగ లేచి పదు తామసమెల్లొ నడంచి పట్టుచున్. 99

బాణములన్నిటం బదనుబట్టి భళేగఁ దయారుఁజేసి కా
లూని ప్రశాంతుడై యెదుటనుండిన లక్ష్యములోన మగ్నుడై
పూనిక నిల్పినట్టి యెలపూవిలుకాని విధాన నామెయుం
బూనెను దృశ్శరాంశువుల భూవిభుమోముపడంక తెల్లనై. 100

"ప్రేమము ప్రేమమంచు నొకపెంపుడుచిల్క విధాన నెద్దియో
వేమరు తియ్యగాఁ బలికివేసితి వయ్యమహాత్మ; కాని యా
ప్రేమమనంగ నెద్ది? ప్రభవించు విధంబది యెద్ది? ప్రేమసం
స్తోమములైన జీవితవిధుల్ పచరించితివే నృపసింహరాజమా? 101

మంచుకొండలకలధౌతమస్తమునకు
భయదసేతుపురత్నాలపాదములకుఁ
గరకుఁగత్తులవంతెనఁ గట్టినట్టి
మగలువంశానఁ బుట్టిన మగడగావె. 102

అలహిమాలయపర్వత మూప లూడి
లాగి దూర్చిన మీబాకు సాగి పోయి,
కడలిమొద్దునఁ జేపలు బుడుకు వాని
గుండె లోనను లోతుగా గ్రుచ్చుకొనియె. 103

కన్నబిడ్డల నెత్తుటికాల్వలందు
మునిగి తేలిన భారతపుణ్యజనని
కంటినీరు ప్రతీకారకాండ మగుచుఁ
జరితశంఖంబు లోపల జన్మమొందె. 104

విచ్చుగత్తులు బాలించు విడుదులందు,
శీల మంగటఁ బెట్టిన స్త్రీలకోడఁ
గ్రూరరాక్షసరతిఁ దేలు గీచకులకుఁ
బ్రేమసంగతు లెందుకో! వెళ్ళ వోయి. 105

స్వేచ్ఛ కోసము గుండెలఁ జీల్చి రాల్చి,
తరలి పోయిన వీరుల త్యాగమందు
ముష్టిసింహాసనాలఁ బ్రతిష్ఠఁ జేసి;
పాలనము సేయు కర్కోటప్రభువుగావె. 106

కడుపునఁ గన్నబిడ్డ, మమకార మొకింతయు లేక ఖుస్రునిన్
నడిమికి రెండుగా నరికి నాడవు రాజ్యప్రలోభచిత్తతన్;
బిడియము లేదె యింక నిటుఁ బ్రేలగఁ బ్రేమమటంచు? భూతమా
వెడలుము రాజ్య మున్నదిగ వేరొక టెందుకు నీకు ధాత్రిలోన్? 107

నిన్నన నేమి లాభమది నీముదితాతలు దంభులందరున్
జన్న పథంబె; ఇంటఁ బడి చచ్చిన రోగమె; ఇందు క్రొత్త యే
మున్నది; కాని వారలిటు మోసపుప్రేమప్రసంగవస్త్రసం
ఛన్నులుగారు; నీవదియు సాధనఁ జేసితి వారి మించగన్. 108

జ్ఞానకిరీటధారివయి, సర్వజనాంగము సంస్తుతించ, వే
దానురతిం జరించు మతధర్మప్రచారకు 'ఫజ్లు'నామునిన్
దేనికిఁ జంపినావు? తమిఁ బేరని రాజ్యప్రలుబ్ధకాంక్షయేఁ
గారణ మహాను గాని, మరి కానగ రాదిక వేరె హేతువుల్ 109

చల్లనిమాటలతోఁ బరులస్వాంతములం గరగించి, ఫజ్లుకున్
మెల్లగఁ జేరి, దువ్వుచునె, మెత్తగఁ గుత్తుకఁ గోసివేయు నీ
యుల్లమునందుఁ బ్రేమ యెటు లుద్భవమయ్యెను? మహాపరీక్షకున్
మల్లఁ బడంగలేవు నడుమంతరపుంబులిబూచికాటముల్ 110

జంతుల కంఠముల్ విరచి, చక్కఁగఁ గ్రోవులు వెట్టి సంతలో
నింతయు జాలి లేక వెలయింపు కసాయికిఁ గూడ బాధనీ
తంతయు వల్లెవేయుట యసాధ్యము గాదు, హృదంతరానుసా
తింతయు లేని మాటలు లయించవె శూన్యపథాన వ్యర్థమై" 111

నూర్జహాను వచించిన సుద్దుల నెల్ల
విని జహంగీరు శోకకొంత వెఱగుఁ జెంది,
"ఏమి యిటులాడు చుంటివి? యేను నాడుఁ
దస్క్రింపులు సేతె వాస్తవమునందొ? 112

కోపమును జేసియాగ దలఁచి ప్రేరేపించిన గాథ ఫజ్లునిన్
మడువగఁ జేసియుండిన యమానుష మంతయుఁ జచ్చుజాడగాఁ
దడవితి! కార్యముల్ నిజమె! దానికిఁ గారణ మేము సత్యయు
న్నుడువవు; రాజ్యకాంక్షయని నోరు బిగించినఁ దీరిపోవునే? 113

కన్నమకుల్ పదేపదిగఁ గాళులకుం బెనఁజుట్టుకొన్నవా
టన్నిటఁ ద్రుంచివేసి, హృదయంబును రాయిగఁ జేసి, పుత్రవి
చ్ఛిన్నము సేసికొన్నయది శ్రీలను బాముకొనంగఁ గాదు; నీ
చిన్నిపదాల భారతి పసింపగఁ జేయుట కోసమేగదా. 114

పండితుడైన ఫెజ్జు మనపావనప్రేమసుధాస్రవంతిలో
బండలు రువ్వి, జీవితము భగ్న మొనర్చెను; వానిఁ బట్టి నే
గుండెలు జీల్చి రక్తమును గ్రోలితి; ఇందున రాజ్యకాంక్ష యే
ముండెనొ చెప్పవే ? ఎటుల నొప్పెనె నీమది కిట్టులాడగన్ ? 115

నేను జేసిన పాపాల నెన్న లేము;
చేయకుండిన పాపాలు సెప్ప లేము;
నిఖిలకలుషాలు నాహృది నిండు కొనియె;
ఇన్నిపాపాలు సేసిన దెందు కొరకొ ? 116

నీదుపదసరోజంబులపాదిలోన
నస్మదీయజీవితసరితామ్రధార
నిర్జరాంతరవాహిగా నిలుపనెంచి
మరచితినిఁ గదే ! నీతులమండలింపు. 117

ప్రణయకల్లోలభయదమ్మై, రగిలి, మండి,
కంపనంబొందు నాజీవకణములన్ని
ఆగవేగాన ముందుకు సాగి, యురికి,
పాపపుణ్యాల నడిమికిఁ బసులఁ గొట్టె. 118

దూరప్రసీమలందుఁ గనుదోయికి లీలగ గోచరించు నే
దోరసవత్ప్రపంచమునుండి త్వదీయసుదాభ్రపాదముం
జీరనినాదముల్ రుధిరసింధువులన్ మథియించివేయు, నా
దారికి నడ్డు వెట్టఁ గలదా మతిఁబోయిన యీపరనీతిశాస్త్రమున్ 119

కారణం బేమి లేకుండఁ గలుగు ప్రేమ
నిర్మలానంతదుర్వారనిష్ఠురంబు;
కుటిలలోకంబుఁ జెఱఁ జేసికొనిన యేనిఁ
దునిగి విచ్ఛిన్న మొందదే తుట్టతుదకు. 120

నిరవధికంబుగా మొలచి నిక్కిన పావనప్రేమకు న్నిరా
దరణము సూప లోకులకు ధర్మమె ? ప్రేమమహీజమూలము
న్నరుకఁగఁ గత్తి నెత్తు నెడ నందను నేని స్వమాత నైన త
ల్దరుగక యుందునే ? తుదకు దైవము నేని యుపేక్ష సేతునే ? 121

కల్మషం బొక యింతయుఁ గానరాని
పరమప్రణయాగ్నివీథిలో భస్మ మవవె
స్వార్థజీవులమస్తకాల్; బ్రదుకఁ గలవె
నీచప్రతికూలశక్తులు నెలతమిన్న ? 122

భావవీథిలో నీచిత్రపటము గట్టి
పులకలెత్తినమేనుతోఁ బొంగి పొరలి
కన్ను లరమోడ్చి నీలోనఁ గలిసి పోయి
యుగయుగంబులఁ జీవించు యోగి నేను 123

వీరప్రణయతపోనిష్ఠఁ జేరి యున్న
నాదుమనసును జనుక యత్నంబుఁ జేయ
బ్రదికి పోదురె ? నాశాపవహ్నిలోన
మాడి పోవరె యెవ్వరైన మాట లేల 124

ప్రేమ కోసము జీవించు వీరవరుల
యఖిలకర్మాలు ప్రేయసి కంకితంబు;
ఏను జేసిన పాపంబు లెన్ని యున్న
పూవులై రాలు నీపాదపుణ్యభూమి" 125

అనుచు నుండిన జాంగిరు కడ్డు వచ్చి
పట్టఁ జాలని కోపంబు పైకిఁ బొంగి
మొగముసాంతము నిప్పులప్రోవుఁ గట్ట
సింగసానయి గాండ్రించెఁ జెలువ యపుడు 126

"నీదుప్రణయాని కడ్డుగా నిలచి నట్టి
స్వార్థపరులను జంపుటఁ బాడి యేమొ
కల్ల కపటంబు లేని నాకాంతుఁ బట్టి
యరవనరవగ నరుకుట దురిత మవదె 127

నీదు రాజ్యంబు క్షేమమై నెగడు కొరకు
నేనుసాంతము గత్తియై మెరసి నట్టి
స్వామిభక్తుని నీకుని ప్రణయమూర్తిఁ
జంపఁ గారణ మేమిఁ జూపింపఁ గలవు?" 128

స్వీయభర్తకై నూర్జాను జేయుచున్న
వాదమంతయు నక్రమపథము వట్టి
సత్యదూరంబు నగుచుంట సైప లేక
మండిపోయెను జాంగిరుమానసంబు. 129

ఎన్నడో యేండ్లపూండ్లు గతించిన నాటి స్వకీయగాధ ప్ర
చ్ఛన్నవిరోధియత్నము విషాదఫలంబులు నొక్కమాటుగా
నన్నియు భావవీధిఁ బయనం బొనరించెను; బూదికప్పులో
నున్న ప్రతీకరాగ్ని భయదోజ్జ్వలమయ్యె మహీశునాత్మలో 130

మెదలక నుండి యుండి మిడిమేళముగా విలయించు సంద్రమై
పొదలెను ధారుణీధవుఁడు; పూవులఁబోలిన తెల్లగన్నులున్
రుధిరపుముద్ద లైనయవి; రోషములోఁ దలఁ బూడమున్గి నా
యదనునఁ దన్నుఁ దాను సఖియన్ సయితంబును వేమరించుచున్ 131

"సైపగఁ జాల నీపలుకుసాంత మసత్యము; నీదుభర్త యే
దో పరమోపకారియని యుత్తమప్రేమతపస్వియంచు నా
కై పడిచచ్చెనంచుఁ దగవాడితి వింతకు దాచ నేల? నీ
కోపము దాపము న్నదరగొండితనం బిక సాగఁ బోవునే! 132

జీవితంబంతఁ బయనించి చేసుకొనిన
యమరకలశంబుఁ బెదవుల నానఁ బోవు
తరుణ మందునఁ గాలితోఁ దన్ని వేసి
మంటి పాల్జేసె నాప్రేమమధుపు నంత 133

సఖుఁడు మనప్రేమ శ్రమియించి సాగి సాగ
తొడిగికొన్నట్టి పూవును ద్రుంచివేసి
భయదవికటాట్టహాసంపు మొయిలు లుమిసి
చేసె మనజీవితాలను జీకటిండ్లు 134

చెలువ! మనరెండుబ్రదుకులు సేరి యొకటఁ
దేలిపోవఁగఁ గట్టిన పూలతెప్పఁ
బచ్చినెత్తురుకెరటమై పగులఁగొట్టి
నీటి పాల్జేసి నటువంటి నీచు డెవడె? 135

కసరి మనరెండుహృదయాలఁ గాల్లుఁ గొట్టి
ప్రేమబింబాల బలిమినిఁ బెళ్లగించి
చిలుపఁ గట్టిన నెత్తుటఁ జేతు లద్ది
తుష్టి వహియించి నిలచిన దుష్టు డెవడె? 136

భావిసుఖప్రపంచమధువాహినితీరములందుఁ జక్కఁగా
దేవళముల్ సృజించి మనదేవునిపూజలు సేయ భక్తితోఁ
బూవులు వట్టి యున్న కరముల్ తెగిపోయెను నాల్గు నీవియున్
నావియుఁ గావె త్రుంచిన వినాశనకారు డెవండొ చెప్పవే? 137

మిలమిలలాడు నీముగుదమేలిమిజవ్వనపుంబ్రసూనము
న్నలిపి కసాయికత్తికొసనం ధరియించి పచారుఁ జేయుచున్
సలిపెను నీక సమ్మతము సర్వమహీవలయంబు నెత్తికిం
బులిమెను మాసి పోని యొకమూర్ఖవివాహపునైచ్యపంకమున్ 138

నీదువాల్చూపుకొనలకు నాదువాలు
చూపుకొనలను మెలివేసి సున్నితముగఁ
బోసికొనినట్టి పూవులపుంతలందు
విచ్చుగన్నులు నాటించి పీటఁబుచ్చి
యున్నదే నా ప్రేమయాత్ర నన్యాయమునఁక 139

నిన్ను నన్నును గండ్లుగా నిలుపుకొనుచుఁ
జూచుకొన్నది మనప్రేమసుందరాంగి
భావిగర్భాన నమృతప్రపంచమొండు;
ఏది యయ్యెది యేమయ్యొ నేమొ చూడు. 140

ఎవనిని నీమగండనుచు నెంతయొ గొప్పగఁ జెప్పుకొంచు నీ
భువనములన్నియుం బగిలిపోవ సమర్థన సల్పినావొ యా
జనుడె, సుందరాంగుడె, విశాలమనస్కుడె, ప్రేమయోగి యీ
భవములనెల్ల సల్పినది; పాపమునీకిది క్రొత్తవార్తసూ! 141

ఎవడె పునీతమైన మనయిర్వుర ప్రేమకలాపజోక్యముల్
దవులగ వీడెవండె వనితా? పరప్రేమసహిష్ణుతల్ మదిన్
లవమునులేని క్రూరుడు గళంకి, విమోహి, కసాయిగాదటే!
ఎవరెఱుఁగంగనట్టిదిది? ఎందుకుఁజేతు వృధా వివాదముల్? 142

కాలము దూలిపోయిన ఘొకానొక వృద్ధగు నీదుతండ్రి పా
దాల స్పృశించి, టక్కరికతల్ వచియించుచు, నన్నుగూర్చి చా
డీలను జెప్పిచెప్పి బురిడించు మదిన్ విఱుగంగఁజేసె ఛం
దాలుడు; ప్రేమజీవని బడాయిలు గొట్టిన విశ్వసింతురే. 143

నాడు నయగారి వర్తనలాడి పాడి
ముసలినీతండ్రి కెంతయో మురువుగూర్చి
చేసె నిన్నవ్వకుండగ చెనటి నాకు
తేనెఁ బూసిన కత్తిగాఁ దెలియదటవె. 144

పరమ ప్రణయోపకారిణి ప్రకృతిచేతి
యమలచంద్రికాకర్పూరహారతులను
భయదవదనోగ్రవిషసిక్తవాయు వూది
యార్పివేసెను జీవిత మారిపోవ. 145

నీదు తండ్రిశోఁగుపుత్రులు నెరపి యొగ్గి
నాడు తండ్రిని మెప్పించినాడు నన్ను
దండయాత్రకుఁ బంపించి దుండగీడు
లెంత పనిఁజేసి యుండిరో యెఱుగవటవె. 146

లేదు నీమీద నాకొక్క లేశమేని
ప్రేమ లేదనిఁ జెప్పిన విడచినాడె
బలిమి నినుఁబట్టి తెప్పించి పంతగించి
పెండ్లియాడిన సంగతి విస్మరింతె. 147

తగదు తగదంచు వాపోయి తల్లడిలిన
లెక్కఁజేయక వాడు నీలేతమురుతఁ
జుట్టివేసెను మంగళసూత్ర మతివ
అదియె నాగొంతు కురిత్రాడు లదిమిఁగట్టె. 148

అట్టివానిని మగడంచు నతివ నీవు
చెప్పుకొంటకు సుంతయుసిగ్గుఁ బడవు
పైనఁ గొండాడుచుంటివి పాపమేమొ ?"
ఎందు కిట్లయిపోతివో యెఱుగరాదు. 149

జాంగిరుండాడి నటువంటి సాహసోక్తి
కతివ హృదయంబు నందునఁ జితికిపోయె
నిప్పుకొండలపోల్పు ఖణిల్లుమనుచు
నయనభగభగల్ కన్నుల నలముకొనియె. 150

గుండెలోపల రేగిన మండుటగ్గి
బయలు వెడలెను లోకాలు భగ్నమవగ
నగ్నిరథమెక్కి విలయించు నంబవోలె
చెలగె నూర్జాను కోపాగ్నిశిఖలమధ్య 151

ప్రబల కోపాతిశయమున వణకుచున్న
యరుణమధురోష్ఠయుగ్మము నందునుండి
జారుచుండిన పల్కులు సానఁదీరి
వజ్రబాణంబులయి రాజువక్షమందు
దూరుచున్నవి యాశలు దునిగిపోవ. 152

"అరరె ! యేమని ప్రేలితి దురితచరిత ?
ఏను నిను స్వీకరింపగనెంచి తొల్కొ
నాదునాథుండె చెనటి యైనాఁడు మనదు
ప్రేమవల్లరిఁ ద్రుంచెనా? పిచ్చిమాట. 153

నిన్ను ప్రేమించనే లేదు నేను నాడు
నేడు ప్రేమించఁగాఁ బోను నిక్కమిద్ది
స్వప్నసీమల వాహ్యాళి సలుపు టేల ?
కండ్లు విప్పి నిజంబును గాంచరాదొ !" 154

ఉలికిపడె రాజు ప్రాణంబు లుడ్డుకుడిచె
తెప్పరిల్లెను కొంతకుఁ దిన్నఁగాను
బాల్యమందున హృదయానఁ బాదుకొనిన
మధురశృంగారవీథులు మదికివచ్చె. 155

కాయమును జాగరూకతన్ గాచుకొనుచు
హృదయమును జంపుకొంటివా యేమొనీవు ?
హృదయముండిన నొకమాటు వెదకికొనుము
అందు నేనుందునో లేనొ సుందరాంగి. 156

మన మిద్దరముగూడి మాటాడుకొనుచుండ
గోలఁజేసిన జిల్లుపూలగాలి
బిగికౌగిటిండ్లలోఁ బెనగి పోవుచునుండ
కండ్లారఁ జూచిన కలువపూలు
మురిపాల పెదవులు ముద్దాడుకొనుచుండఁ
దీపికెక్కిన ద్రాక్షతీగె గములు
కన్నీట నొందారు గారవించుచునుండఁ
గరగిపోయిన చంద్రకాంతశిలలు.

గీ॥ చచ్చిపోలేదు మనప్రేమసరితమందు
మునిగితేలిన మరుసటిక్షణమునందె
నిర్జరత్వము దాలిచి నిలచిపోయెఁ
గాని మనప్రేమసాంతము గల్లయేన. 157

నునుపుఁజెక్కుళ్ళు నొండొరు నునుపుఁ జూడఁ
గలసికొన్నట్టి మనమోహకలువజంట
ద్విత్వపూర్ణిమవిభవమున్ దీర్చి దిద్దె
ముదురుచీకటిరేలనఁ బువులవనికి. 158

నాటి నుండియు నేటికో నాతిమిన్న
మనలఁ జూచిన యపుడెల్ల మస్తములను
వంచి స్తోత్రించు చుండును వనములచ్చి;
కన్ను లుండిన నీవును గాంచఁ గలవు. 159

అతివ మనప్రేమసుకుమారలతిక మీఁద
ద్వాదశవసంతమధుపుష్పవస్త్రములను
నల్లుకొనినట్టి ప్రకృతీమతల్లిచేయి
సాక్ష్యమయి నిల్చు జగములు సన్నఁ గాని 160

నీవు నేనును భావాస నేక మగుచు
సృష్టి జేసితి ప్రణయోత్కృష్టజగతి
శిథిల మైనను దానిలో మధురవహ్ని
యారి పోలేదు మనప్రేమ మారి పోయె 161

జిలిబిలినవ్వులతో మెదపి చెప్పిన నీప్రణయోక్తి నాదుహృ
ద్వలయమునందుఁ గట్టెను సుధామధుసాగరకోటిభంగసం
కలములు; ప్రేయసీ పదునుగత్తి యిదేఁ దెగగోసి చూచుకొ
మ్ము; లవమసత్యముం గనగఁ బోవు మఱెందుకు కాలయాపనల్ 162

పదియురెండువసంతాలప్రాయ మంది
యలరు నీచేతిచిగురాకు నద్దుకొన్న
నాదుచేతిన నాజీవనంపు విధము
రేఖలయి నిల్చె భావివిలేఖనమ్యో 163

అనయు మా రేఖ నేటికిఁ జెరిగిపోగ
చెరిగి పోలేదు నీముద్దుచేతిపసయు
నాటి మనప్రేమబంధముల్ నాశ మయిన
నాశ మొందునె సాక్ష్యంబు నళిననయన 164

బాల్యకాలాన గుండెపై; బడినయట్టి
పచ్చిగాయాలు మానవీ పాటికైనఁ
దలుకువాల్చూపుఁ జొప్పించి కొలిచి చూడు
మవియు నీచూపుటాదులు కానో కాదో ! 165

సర్వజీవులసాక్షిగ జరిగినట్టి
వలపుపెండ్లికి విడియాకుఁ బారవేసి
క్రూరసరపాళి చేసిన కృత్రిమంపు
పెండ్లి కెవ్విధి లొంగితో విమలహృదయ ! 166

వాస్తవంబైనసూర్జాను స్వప్నమందు
స్వప్నసూర్జాను వాస్తవజగతియందుఁ
గానవచ్చుచునుండిగీ కనుల కిప్పుడు;
తల్లక్రిందాయె జీవితధర్మమంత !" 167

అరమర లేక రాజు హృదయంబును విప్పియు కుంభవృష్టిగాఁ
గురిసెను శోకముల్; ముదుకుకొండలగుండియ లెల్ల నీరులై
చెరగెను; లోకమందుఁ బొలిచెన్ గరుణారసలోకముల్; మహా
తురయయి సూర్జహాను స్పృహఁ దూలి మునింగెఁ దదంతరంబునన్ 168

అస్పష్టమైనట్టి యాంవేదనం బొందు
హృదయాన నెచ్చటోఁ దగల సాగె
అవ్యక్తమైనట్టియనుభూతి యెయ్యదో
తియ్య తియ్యగ గుండెఁ దేవ సాగె
విస్మరితంబైనవిశ్వంబు స్మృతివీధి
దరులందు గిరగిరఁ దిరుగ సాగె
ఎండిరాలినయాస లెట నుంచో శాకులై
చిట్లు చిట్లున గుండెఁ జింప సాగె

గుండె లోనకు నొక క్రొత్తగుండెకాయ
మనసు లోనకు నొక క్రొత్తమానసంబుఁ
బెనగి చొరఁబార యత్నించు విధము గాను
నుక్కిబిక్కిరియై పోయె నువిద యపుడు 169

రెండువ్యతిరేకశక్తు లుద్దండ గతిని౯
బీడనము సేయుచుండఁ బబ్బిబ్బు లగుచుఁ
గటకటం బడి కొంతకుఁ గాంత యెట్లొ
ప్రాణముం బిగఁబట్టియుఁ బలికె నిట్లు 170

"ఎన్నఁడొ మంచిసెబ్బరల నేమి యెఱుంగని చిన్నపిల్లనై
యున్న దినాలనాటికత లూతగఁ దీసి కొనంగ నేల నా
కన్నిగుణంబు లబ్బి నడయాడఁ గడంగిన నాటి నుండి ని
న్నెన్నఁడు నైనఁ గన్నుగవ నెత్తియుఁ జూచినఁ జెప్పరాదొకో 171

బాల్యచేష్టలఁ బ్రేమగాఁ బరిగణించి
ప్రాకులాడుచు నుంటివా వసుమతీశ
భ్రాంతి విడనాడి కనుగొమ్ము వాస్తవమును
బాలికను గాను నే మగనాలి నైతి." 172

వేగ నూర్జానుమాటలు పిడుగు లగుచు
రాజుమదిలోన దావాగ్ని రాల్చి పోయె
బ్రదుకుటాసలు గలఁగాలి భస్మ మయ్యె
కువలయంబంత శూన్యమై గోచరించె 173

"అక్కట పాతికేండ్లు యమయాతన లెల్ల సహించి జీవముల్
జిక్కుల పాలుగాఁగఁ గృషిఁ జేసిన దంతయు నేను జూడ నీ
టక్కరిప్రేమ కోసము ? కటా ! యిక నేమి మొనర్తు ? ప్రాణముల్
దక్కిన నేమి సార్థకము ధ్వస్తమయెం గద జీవితాశలున్ 174

నాయుష్ణరక్తంపుదనములు జిమ్మించి
పారాణిఁ బూసితే పాదములకు
నాజీవసూత్రాలు నగిషీగ మెలివేసి
కంకణాల్ కట్టితే కరములకును
నాగుండెకడలిలో నటియించు తొణకులో
నుయ్యాలలూపితే యువిద నెపుడు
నాప్రేమకర్పూరనవ్యాజనముఁ గోడ
నీవాళు లిచ్చితే నిర్మలతకు

మృత్యువదనోగ్రపథముల మీఱి నడచి
యెవరి కోసము బ్రదికితో యున్నినాఁడు
లట్టి నాబాహ్యప్రాణంబు నమృతమూర్తి
మిథ్య యయిపోవ నేనును వధ్య డధనె" 175

ప్రక్కన ప్రేలియాడెడి కృపాణమును న్నొరనుండి బైటకున్
గ్రక్కున లాగి కన్నులను గట్టిగ మూసి యురంబు లోనకున్
గ్రుక్కుకొనంగ జాంగినృపవరుండు తెగించుచు నుండె; నూర్జహాన్
జెక్కిన సాలభంజ కయి చేష్టలు దప్పెను దక్షణంబునన్ 176

అప్పుడు నూర్జహానుకను లందనఁ జీకటు లల్లిబిల్లిగాఁ
దెప్పలు గట్టి పోయినవి; దీనముగా నడిగుండెకాయలో
నెప్పుడొ విన్న గొంతుక మహీధరముల్ గరుగంగ నేదియోఁ
జెప్పఁ దొడంగె; ప్రేమమధుసింధువు పొంగిన దాఁటుపోటులై 177

త్రుళ్ళిపడి లేచి వెంటనే శోచసుజాతి
చూచుకొన్నది తనచేయిఁ జోద్య మవఁగ
నవనినాథునిహస్తంబు నదిమి పట్టి
యాత్మహత్యను వారించి యాపు చుంట 178

ప్రాణము వీడగా మొరకుపట్టుదలం దల నింపుకొన్న భూ
జ నికి కొంతసేపటికి శాంతిమనస్కృత లభ్య మయ్యె; నా
మానిని చేతిచల్వలకు మారణహోమము లారిపోయి నై
బూనెను నవ్యజీవితప్రభూదయకాంతివిశేషసంతతుల్ 179

నెమ్మదిఁ గండ్లు విచ్చి దయనీయవిలోకనదీర్ఘరశ్మిలోఁ
గొమ్మకనుల్ స్పృశించి తలఁ గొంచెము క్రిందకు వంచినాడు, పొం
దమ్మిమొగాన సంభ్రమసుధల్ చెమరించగ రాజవక్షమం
దిమ్ముగ శీర్ష మాన్చి వనజేక్షణ గట్టిగఁ గౌగలించుచున్ 180

"ఇంతటి ఘోరకార్యమున కిప్పుడు బూనగ నేల నాథ నా
కెంతటి ప్రేమ యున్నదియొ ! యెన్నిదినంబులు నీదురాకకై
వంతలు సెందినానొ ! భగవంతు డెఱుంగును; నాడు లేని యీ
పంతము నేడు నెందులకు ? పల్వురినోళుల నానిపోవనా ? 181

పట్టును వీడ కుండఁ దనప్రాణముతో శపథంబుఁ జేసి న
న్నట్టులలో నిన్ను వీడునటు లేర్పడఁ జేయ నహర్నిశంబులున్
గొట్టుచుఁ దిట్టుచున్ గసినికోతలు గోసిన తండ్రి నేని య
ప్పట్టున లెక్క సేసితినె ? భావము సుంతయు మార్చుకొంటినే ? 182

బలిమిని నన్నుఁ బట్టి పెరవానికి పెండిలిఁ జేసి యెన్నియో
సిలుగులు పెట్టుచుండినను శీర్షము సుంతయు వంచకుండ నే
మెలగితి నాదు నెల్లు; తమమేలిమిరూపము జూచు వాంఛతో
నిలిపిన కండ్లజంటపయి నిల్వున సోకె నిరాశఖడ్గముల్ 183

పెండిలి యాడి నన్నుఁ గను ప్రేముడిఁ జూచుచు దాసదాసునై
యుండిన భర్తమోము గనకుండగ నెప్పుడు నీదురాకకై
యుండితి నర్ధవత్సరము యోపుయుమందున ముగ్గి నాశలన్
బిండుచు శోకమాలికలఁ దీనను [illegible] క్రుంగి [illegible]

అసమవిషాదభంగములయందున నన్నిటుఁ బారవైచి నీ
కసరతనంబుకొద్ది యురికాండము జెండుచు యుద్ధభూమిలో
మెసవుచు రాజరక్తమును మెత్తనిమత్తునఁ గండ్లు వాల్చి నా
దెస పరికించినావె? కడతేర్చితివే నిను నమ్ముకొన్నచో? 185

కాచితి వత్సరంబు కడగండ్లు సహించుచు నీదురాకకై
వాచె మొగంబు నాశలును వచ్చినత్రోవల వెళ్ళిపోయె; నా
నోచిననోము లివ్వియని నోరుఁ గదల్పకఁ బ్రేమ దోసిళుల్
జాచిననాథుకోర్కెలకు సమ్మతిఁ జూపితి నేమి సేయుదున్ 186

బలముపయోగపర్చి పరిపంథిశిరాలను ద్రుంచి కోటకు
న్నిలువున బ్రేలఁగట్టి భువినిన్ దలక్రిందుగ మూపు కెత్తుకోఁ
దలచిన రాజ్యకాంక్షఁ బడి తప్పుడవై యిపు డిన్నినాళ్ళకున్
దలచితివే ప్రియాదరణధర్మము బాలనఁ జేయ భూవరా? 187

సంగరరంగమందు నృపశాత్రవులం బొలియించి రాజ్యమున్
మ్రింగి సుఖించుటోఁ రుధిరిసేదినియందున ఖడ్గధారలోఁ
గృంగి నశించుటో గద మహీశులయీప్సితముల్ మరేల నా
సంగతి? ప్రేయసీప్రణయసారము లిచ్చునె రక్తభోజనాల్? 188

నీవు నిల్పిన రాజ్యంపునీటుగత్తె
కదలికెరటాల మునిగాళ్లు దడుపుకొనుచు
మంచుకొండను జేత స్పృశించుకొనుచు
నూఁగుచున్నది యుద్యాల లుర్వి యదర
చూచుకొనరాదె యూపెను సుఖముగాను 189

రాజ్య ముండగ రక్తంపుభోజ్యముండ
విరహబాధను వారించఁ దమఃశాలుంక
పాపశీలిని దిగ్రమింగఁ బాస ముండ
ప్రేమసంగతు లెంచుకో నెట్టుఁ గాక." 190

ఉబికి పొంగెడిదుఃఖపుటుదధి నెట్లొ
నాపుకొస నెంచి జాంగిరు డప్పు డేమొ
వదనబింబము గ్రిందకు వంచినాడు
కాని కన్నీటిధారలు గాల్వ లగుచుఁ
బారుచున్నవి భూదేవి పరితపింప 191

కారెడుకంటినీళులు మొగంబునుసాంతము నేటవేయగా
భూరమణీశుడుం బసయుఃబోయినగొంతుక నుంత విప్పి యీ
తీరునఁ బల్కసాగెఁ గడుదీనముగాఁ బెడగొంపగుండెలు
న్నీరయిపోవ సర్వధరణీతల మల్లలలాడి పోవగ౯ 192

"ఎంత్రబతిమాలి వేడిన నుంతయైన
విన్న పాపాన బోనె నింగన్నతండ్రి
అబ్బ ! యనరాదు గాని నీయయ్యనంటి
కఠినచిత్తుని మందునఁ గనగలేము 193

యుద్ధము సేయఁ బోయినది యుర్విని బ్రాముకొనంగఁగాదు, నీ
యొద్దన యుండలేని బ్రదుకుండిన లాభము శూన్యమంచు నా
యుద్ధమునందె యెట్టులనో యూపిరి వీడగ నెంచి, నాడు నే,
మొద్దుతనానఁ బోయితిని ముందును వెన్కను బారజూడక 194

చేయునది లేక నేనును జింత వడుచు
మరణమే మంచిదని యెంచి తరలినాను
అంత్యదేవతాస్వైరవిహారఘోర
సీమయయినట్టికదనానఁ జిదిగిపోవ 195

సుడిగాలి వేగానఁ జుగకత్తిబేకులు
గుండెసూటిగ వచ్చుచుండ నైన
బడబాగ్నికీలలఁ బరఁజిమ్ముబాణాలు
గండ్లలోనకు దూర గముకుచుండ
మదగజసంఘాలు మాటిమాటికి నన్నుఁ
దుండాలతో నల్పి దూయఁ బోవ
పగవారిచేతులలో బరువైనగద లెన్నొ
తల నుగ్గుఁ జేయఁగఁ దలచుచుండ

ప్రాణరక్షణ నాకింతఁ బట్టలేదు
నిశ్చలంబుగ యుద్ధాన నిలచినాను
తరుణి! నీనామ మెప్పుడు దలచుకొనుచు
ప్రాణమును వీడ శపథంబుఁ బట్టినాను 196

కత్తికి కత్తి రాచుకొని కన్నులలో నలుసంతముక్కలై
గుత్తనినెత్తుటం దడిసి కుంకుమపుష్పొడితిప్ప లైన నా
యుత్తరదేశయుద్ధమున నూపిరి కోసము నొక్కసారి నే
నెత్తగ లేదు కత్తి యిక యెందుకు నాబ్రదు కంచు నెంచుచున్ 197

స్వామిభక్తినిఁ జరియించు సైనికాళి
జాగరూకత నారక్ష సల్పినారు
కత్తి కదలించి యెఱుగ నాకాలమందు;
నెట్లు బ్రదికితో నదియంత నీకు డెఱుగు! 198

నెత్తురు సంద్రమై పడి, ఘనీభవమొంది, కరాళకాళికిన్
జిత్తము.నచ్చ గద్దెలను జేసిన భీకరయుద్ధభూమిలోఁ
దత్తర మొందకుండ నిను ధ్యానము సేయుచు, నీదురూపసం
పత్తినిఁ జూచుకొంచుఁ, దల వంచి వసించితి భీతిహీనుడై 199

మిత్తికి జీవితంబులను మేపుచు నుండిన రుద్రభూమిలో
నెత్తురు లెండి నైన ధరణీధరమందున నుష్ణబాష్పసం
పత్తిని వ్రేలఁ దీసి యతివాస్తవచిత్రణ జేసినాడ నీ
చిత్తమువున్ గనుంగొనుము చెప్పదే యయ్యది నాయుదంతమున్ 200

రణమునందున మరణంబు రాకపోయె
యిల్లు సేరిన పిమ్మట నెట్టు లైనఁ
జావ వలె నంచు గట్టిగా శపథ మూని
వాయు వేగాన ఢిల్లీకి వచ్చినాను 201

చావఁ బోయెడి ముందుగా సఖియ నీదు
వదన మొకసారి చూడంగ వాంఛ గలిగె
నెంతయత్నంబు సేసిన నేమి సెపుము
తిరుగ డాయెను నాపుది విరిగె పగ్గ 202

అంతలోననె నాతండ్రి యారిపోయె
రాజ్యభారంబు భుజమున వ్రాలిపోయె
సకలభారతి నాచేత నణగి నిలచె
హద్దులేనట్టియధికార మానహిల్లె 203

ఉన్నదియంతయైన వినియోగ మొనర్చియునేని నిన్ను నా
కన్నులఁ జూడ నెంచితిని; గౌరవమూడిన రాజ్యమంతయున్
సున్నయిపోయినన్ బ్రదుకు శూన్యములోనలయంబుఁ జెందినన్
వెన్నను జూపరాదనెడి భీకరనిర్ణయ మొండు సేసితిన్ 204

నీతినియమాలుజీవితనిత్యవిధులు
జాలి క్రౌర్యంబులనెడి విచక్షణంబు
లన్నిటన్ద్రుంచి యతివయొళ్లొ
చేసుకొన్నాను నీపాదసీమకిపుడు 205

నీవు సమ్మతిఁజూపిన నేటినుండి
బ్రదుకుచుందును నీపాదపంకజమున
కాకపోయిన బ్రదుకును గాల్చివేసి
భావమయి నీహృది పవ్వళింతు" 206

అనిన జాంగిరు మాటల కతిన యెడద
కరగి యొకపెద్దవలపుల కడలియయ్యె
క్షుద్ర సాంఘిక చైతన్యక్షోభమంత
సమసిపోయెను ప్రణయసుమములు పూచె 207

కరుణ రసపూరితములైన కనులువిచ్చి
సున్నితంబుగ నొకసారి చూచెనతివ;
స్వచ్ఛమైనట్టి వెచ్చని భాష్పజలము
రత్నగర్భాన ఝల్లున రాలిపోయె 208

రక్తరసమున భరతోర్వి రంగరించి
చేవమీరిన రారాజుచేతులపుడు
ప్రణయలతలయి చల్లగాఁ బ్రాకిపోయె
కలికి యొకచిన్నిపూవయినిలచె నందు 209

"కనులకుఁ గప్పియుండిన ప్రగాఢతమస్సులు చీలిపోయి నీ
యనుపమప్రేమవార్నిధులుసాంతము గోచరమయ్యెనో మహా
జననిధిపాల నాయెదను స్థాపనజేయుము. నీదుపాదముల్
మననము జేసికొంచును సమర్పణమ య్యెద వానిసేవకుఁ 210

కటికికసాయినీతులకు గౌరవమున్ సలుపంగనెంచి య
క్కటికము నూడ్చివర్తిలితి; కమ్మనినీమహజీవితంబు సం
కటముల పాలుజేసితి సఖా; యికనేమి వచింతు నింతకుఁ
జటులతరాగ్నిఁ గాలి యికఁ జత్తును సైపగలేను తాపముల్ 211

నాకొరకెన్నొ శక్తులు తృణంబులుగా వ్యయియించి, లాంభమున్
జేపురకుంటచే బ్రదుకుఁ జీదరఁజెందియు నాత్మహత్యకున్
దూకితిరింత ద్రోహమున ద్రుంగిన పాపినినే నెగాదె; ఛీ
కాకయిపోయె జీవితము; కల్గునదేమిక నేను జచ్చినన్ ! 212

ప్రణయమధురాభ్రసీమపై బరగునట్టి
మీదుహృదయంబు నాశనవాది యగుచు
నశనిపాతాలు వర్షించి యఘములోన
మునిగి తేలుట నామూలమున నెగాదె 213

కరుణారససిక్త హృదయుడైగాలునిన్ను
రక్తభోజిగఁ జరితంబు వ్రాసిపెట్టె
నట్టి స్థితులను గల్పించినట్టి ఘోర
భయదరాక్షసి నేనింక బ్రదుకనేల” 214

అనుచు గోడుగోడున కాంత గొంటెల్లి
రాజుకడుపునఁ దలదూర్చి వ్రాలిపోయె
కరుణరసవాహినుల్ గుండెఁ గదిపివేయ
వణకుబెదవుల జాంగిరు పలుకసాగె 215

“పటిలజనములు నిల్పిన కూళనీతి
మీర శంకించి కాలంబు జారవిడచి
భగ్న మొనరించుకొంటి నాబ్రతుకునంత
నిందు దోషమేముండె నిందువదన 216

గడచిపోయిన నెత్తుటిగాథయంత
నేను జేచేతులారంగ నెరపినదియె
లేదు నీకందు భాగంబు లేనెలేదు
కలత నొందగ లేదింత కారణంబు 217

సర్వమును ధారఁబోయుచు శ్రమల నోర్చి
తుదకు ప్రాణాలనేనియు వదలనెంచి
యెవరికొరకయి క్షోభించితిన్నినాడు
లట్టి నీవిటు ననువీడి యరుగదగునె 218

గతమును విస్మరించి కడగన్నులతో నను బారజూడు మో
సతిరొ ! మహానలోగ్రశిఖసాయకభిన్నమనోమదీయజీ
వితప్రసవంబు నూత్నరుచిపేశలతల్ వహియించి నేటితో
మృతినిజయించి నిల్చెను; మహీంతలికెల్లను స్తోత్రయోగ్యమై 219

అట్టె జాంగిరు దోసిలి పట్టినిలచె
దీనదృక్కుల నాయమ తేరిచూచె
బాలచంద్రుని తాకునఁ బరవశించు
చంద్రకాంతము నాయెను సఖియకరగి 220

లీల నరగండ్లసొగసులు దేలిపోవ
రాజుచేతులజంటను రమణి బట్టి
చేర్చుకొన్నది యాశ్లేషసీమలందు
రెండు హృదయాలు క్షణములో నొండయయ్యె 221

సంజ చిలికిన నెత్తుట సమసిపోయి
పశ్చిమాశాంగనాముఖభాగమందు
కలితకమనీయహాసంపుఖండమట్లు
బుడుతనెలవంక చక్కఁగాఁ బొడిచినిలచె 222

తల్లిభారతీకోటిహస్తాలలోన
దేవదీపాలవెలుగులు దేజరిల్లె
ధర్మదేవత యుగములతపము పండి
కన్నులానందమునవిప్పి మిన్నుజూచె 223

మొగలురాయళ్ళకతలలో సొగసులూర
ఘుట్టమొక్కటి పట్టంబుగట్టుకొనియె
విరచుకొనివచ్చు సుడిగాలివిసరుకెట్లో
వచ్చిపడినది మొగలులవనమునందు
చూడశక్యముగాని ప్రసూనమొండు ! 224

సంపూర్ణము

48

# తప్పొప్పుల పట్టిక

| పుట. నెం. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 6 | భాష్పముల్ | బాష్పముల్ |
| 4 | 8 | గాసునీళులై | గాచునీళులై |
| 4 | 15 | బ్రతిష్టితంబొనర | బ్రతిష్ఠితంబొనర |
| 5 | 12 | మానవజాతిన | మానవజాతి |
| 7 | 20 | నెటులోఁ | నెట్టులోఁ |
| 8 | 5 | కవోష్ణిబాష్పముల్ | కవోష్ణబాష్పముల్ |
| 8 | 14 | కొండపై | కొండపె |
| 8 | 16 | సామ్రాటు | సామ్రాట్టు |
| 8 | 19 | అరయుచురూఢి | అరయుసురూఢి |
| 9 | 17 | స్రవియింతురంటు | స్రవియింతురంటు; ఈ |
| 9 | 19 | మరేమొనంటు | మరేమొనంటు; ఈ |
| 12 | 3 | తలుచుకొన్న | తలంచుకొన్న |
| 14 | 11 | జూచుకొంటిని | జూచుకొంటి |
| 14 | 18 | శివీముఖ | శిలీముఖ |
| 17 | 11 | కరుణపరిపూరిత | కరుణపరిపూత |
| 20 | 1 | మధునికేతమందు | మధునికేతనమందు |
| 20 | 13 | న్నలువు | న్నలుపు |
| 21 | 13 | కలధూత | కలధౌత |
| 21 | 16 | మగలు | మొగలు |
| 22 | 13 | మసమిద్ధరము | మనమిద్ధగము |
| 35 | 10 | దగలసాగె | గదలసాగె |
| 37 | 1 | రక్తంపుదనములు | రక్తంపునదములు |
| 37 | 12 | వధ్యుడదనె | వధ్యుడవనె |
| 37 | 15 | జాంగిరున్నృపవరుండు | జాంగిరున్నృపుండు |
| 44 | 7 | భాష్పజలము | బాష్పజలము |
| 47 | 9 | సొగసులూర | సొగసులూరు |



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B116 |
| పుస్తకం పేరు | పు న స్సం ధా న ము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ii,iv,vi,viii,4 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |